భయపడ్డది. ఈజాడ్యాలకూ, బాధలకూ అతీతుడనుకుంది ఆయిన.

"చలి, చలి, శాలువకప్పు"

శాలువలేదు అక్కడ.

"ఏదో వొకటి కప్పు, తొరగా!"

తీసుకురావడానికి వెళ్ళబోతోంది.

"వెళ్ళకు. ఒక్కనిమిషం ఆగలేను కప్పు ఏదోఒకటి"

"ఏం లేదు"

"తొరగా"

"ఎవర్నన్నా పిలుస్తా"

"వొద్దు తొరగా"

"ఏంలేదు"

"నీజుట్టు కప్పు"

దగ్గరకు వెళ్ళింది. ముడివూడదీసి ఆపెద్ద జుట్టును విదిలించి కప్పుకున్నాడు.

"హాయి! హాయి! అమ్మా బావుంది... బావుంది... యింకాచలి... అబ్బా దగ్గిరికి...యింకాదగ్గిరికి, నీజుట్టులో నీవొంటో యెంత వేడుందో! ఎంతచలి, ఎంతచలి, యింకాదగ్గిరిగా!

పున్నమ్మకి ఆశ్చర్యంగావుంది.

దగ్గిరికి లాక్కుంటున్నాడు. మెల్లిగా ఆమెనంతా ఆక్రమించుకుంటున్నాడు. వూరికే వొణుకుతాడు. పున్నమ్మ ఏపురుషుణ్ణీ అంతవరకు తాకలేదు. ఆమెకు స్పష్టంగా తెలీదు పురుష సంబంధమంటే యేమిటో. ఆమెకసలు ఆ వాంఛ

మెన్నడూ ప్రారంభించలేదు. కొంతసేపు చూసింది. తీర్థుల చెయ్యి ఆ వొణుకులో యిటూ అటూ ఆమె శరీరంలో కదులుతోంది. పున్నమ్మకి అది సహజంగా తోచలేదు. ఏ రోగానికీ అది చిహ్నంగా కనపడదు. లేచి వెళ్ళిపోవాలని వుంది. అసహ్యం సహజంగా కలుగుతోంది. కాని అమితమైన భయం. కోపమొస్తే ఆయనకి తానేమౌతుంది? ఏ దేవతనో తన మీదికి పంపితే? శపిస్తే? కొంచెంసేపుండి—

"వెడతాను, యింక వచ్చేడం తెన్నాను."

"ఊఁ, మాట్లాడకు నేను దేవిని. ఉగ్రస్వరూపిణిని. నీవు నాభక్తురాలివి. నిన్నావహిస్తున్నాను. నేనే నువ్వు.. నువ్వే నిన్ను. బిడ్డా, ఏమే-విను, నీభక్తికి మెచ్చాను. నీలో ప్రవేశిస్తున్నాను. నాశక్తి నీలోపల ప్రవేశిస్తోంది నాదివ్యశక్తి - నీవొళ్ళంతా వొణుకుతుంది, గగుర్పొడుస్తుంది. చెప్పలేని ఆనందం కలుగుతుంది నా దివ్యస్వరూపం నువ్వు చూడలేవు. కళ్ళుపోతాయి. మూసుకో. కళ్ళుమూసుకో—"

అబ్బా, యిదేమిటి ? యిట్లా చేస్తున్నాడు? వొళ్ళంతా నీచమైపోతోంది. తనని వూపిరాడకండా అదుముతున్నాడు.

"వుండండి—స్వామీ—నన్నొదలండి"

స్వామి ఎవరు ? మాట్లాడకు, చచ్చిపోతావు, పాపం! భస్మమై పోతావు. కదలకు అయిపోయింది. వుండు—నేను యీశ్వరిని. నాజ్యోతి నీలో ప్రవేశించింది. ధన్యురాలివైనావు."

కళ్ళు మూసుకుంది.

అతని వూపిరి అతి తీక్షణంగా ఆమె మొహానికి తగులుతోంది.

"ఏంజరిగినా, ఏమైనాసరే కదలకు. కదిలావా, తల సహస్ర..............

నేను మంత్రరూపిణిని. మహామంత్రంలో వున్నాను."

ఆమె కదలలేదు.



తెల్లవారకట్ట మూడింటిదాకా చలి ఆగలేదు తీర్థులకి. రెండు నెల్లయింది.

ఒకనాడు మధ్యాహ్నం పున్నమ్మ శిరసువంచి భక్తితో "నాకు మందుకావాలి" అంది నమ్రతగా.

"ఎందుకు ?"

"ప్రొద్దున్నే వాంతులుగా వున్నాయి"

"ఓహో ! సరే ! నయంచేస్తాను"

ఆనాటినించి ప్రతిదినమూ తీర్థులు ఏవో గొప్పగొప్ప మందులు తయారుచేసి యిచ్చాడు—కాని డోకులు మాత్రం కట్టనేలేదు.

"ఈ మందుతో యిట్లాంటిడోకులు ఎన్నో కట్టించాను. కాని నీ దేహం చాలా విచిత్రంగా వుంది. ఇంక లాభంలేదు. ఇవి కట్టే డోకులు కావు. మంత్రమో తంత్రమో ప్రయోగించాలి" అన్నాడు.

మూడునెల్లయింది. పున్నమ్మకళ్లు యింకా అంతర్ముఖములైనాయి. ఆమె చంపలు యింకా పాలిపోయినాయి. ఆమె మాటలు యింకాతక్కువైనాయి. ఆమె సేవలుయింకా పొద్దు పోతున్నాయి.

తీర్థులు ఆవర్షాకాలం యజ్ఞం మొదలుపెట్టాడు. అగ్ని గుండము ముందు ఆయన కూర్చొనివున్నాడు. వందమంది బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పున్నమ్మ సామగ్రులు అందిస్తుంది. ఊరంతా ఆహ్వానింపబడ్డారు. తీర్థులు లేచి యిట్లా మాట్లాడాడు—

"ఒక గొప్పవిశేషం. యీదేశానికి, యీదేశానికే కాదు. లోకానికంతా మంగళకరమైన వార్త నేను మీకు చెప్ప బోతున్నాను. ఈతాటిపర్రు యీశ్వరుడిచేత అనుగ్రహింప బడ్డది. ఈ ప్రజలందరూ ధన్యులు. ఇంత పుణ్యక్షేత్రం కావడం చేతనే యీశ్వరుడు నన్నిక్కడికి పంపినట్లున్నాడు. ఈ వూరి నామం యింకా లోకమంతా మోగబోతోంది. నిన్నరాత్రి రెండు గంటలప్పుడు ఒక పెద్ద వెలుగు బంగారు తేజము బంగారు మెత్తదనము కలది ఆకాశం మీదనించి బైలుదేరి మెల్లిగా క్రమంగా భూమి మీదికి దిగింది. నేను చూస్తూనే వున్నాను. అంత వరకు నాకు నిద్ర పట్టించనే లేదు. నా హృదయంలో అద్భుతమైన భక్తి వుద్భవించింది. దేవతలు నిస్వనము లూదారు. పుష్పవర్షం కురిసింది. మునులు కీర్తనలను పాడారు. అవన్నీ మీకు వినపడవు, ఆ తేజస్సు భూగోళముపైని ఒక్క నిమిషమునిలిచి వెతికి, మనదేశం వేపుతిరిగి, మన వూళ్ళోప్రవేశించింది. ఏదో అవతార ప్రారంభమని నాకు తెలియనే తెలుసు. ఈతాటిపర్రులో యేగర్భంలోనో యీశ్వర తేజస్సు అవతారమెత్తిందని స్పష్టమయింది. కాని యీ అవతారం అవసరమేమని యోచిస్తూ నిద్రపోయినాను. కన్నులు మూయగానే నాముందు శ్వేతాంబరధరుడు, రక్త

నేత్రుడు, దయార్ద్రపపూర్ణుడైన దేవదూత దివ్యతేజస్సుతో వెలుగులో, నిలబడి, యిట్లాఅన్నాడు. "వత్సా! యిందాకటి వెలుగును నువ్వు చూసేవుంటావు. దాని రహస్యాన్ని నీకు తెలపడానికై నేను పంపబడ్డాను. ఆదివ్యతేజస్సొక మనుష్య గర్భాన ప్రవేశించబోతోంది. దానిని కాపాడవలసిన విధి నీపైన నిర్ణయింపబడ్డది. నీతరువాత పుణ్యాత్ములైన యీ పవిత్రక్షేత్రపు ప్రజలపైనవుంది. ఈ అవతారానికి కారణము విను. పురుషధర్మం చెడ్డదా, లోకానికి ఆపద లేదు. కాని గృహిణి, మాత, యైన స్త్రీ శీలం చెడిందా ప్రపంచం మొదలంటనాశనమే. కలిపురుషుడు పురుషున్ని ఆక్రమించాడు, ధ్వంసం చేశాడు, పరిక్రమించాడు, ఇప్పుడు స్త్రీలని కదిల్చాడు. ఈనాడు స్త్రీలధర్మాన్ని ఆచారాన్ని నాశనానికై బద్ధకంకణుడైనాడు. ఆతని అధికారం సాగిందా, యింక ప్రపంచవినాశమే! ఆఆపదనించి లోకాన్నుద్ధరించడానికే యీఅవతారమవసరమయింది. ఎంతో బలవంతంమీద తన అర్ధాంగిని, పార్వతిని, కొంతకాలము యెడబాసివుండడానికి మంగళమూర్తి పరమేశ్వరు డంగీకరించాడు. సమస్త దేశాలలో పవిత్రదేశమూ, కర్మభూమియైన యీభారత స్త్రీధర్మ పునరుద్ధారణకై, విరివిగా వ్యాపిస్తున్న యీపునర్వివాహ, విద్యాది మహాపాతక విధ్వంసనానికై అంబ అవతారమెత్తుతుంది. మహిషాసురమర్దని సంస్కారప్రియమర్దని కాబోవుతున్నది. ప్రాముఖ్యంగా స్త్రీ పాతివ్రత్యానికి మూలవిరాట్టగు వితంతువుల నుద్ధరింపబూనిన పార్వతి వితంతుగర్భానే జన్మమెత్తి పురుషుడి నిమిత్తం లేకుండానే తాను ప్రవేశించి, అవతార

మెత్త తలుచుకున్నది. రేపు రాత్రి గర్భప్రవేశము, నవమాస
ములు కాలాతీతముగనుక, షన్మాసాలలోనే ఆమె భూపత
నముకా తలుచుకున్నది. ఈపుణ్యక్షేత్రంలోని వితంతువర్గంలో
ఒకరిని దీక్షాపరురాలిని ప్రత్యేకించి నీవు చూచినట్లయితే,
ఆమెలో ప్రవేశింప ఆ జ్యోతి పూనుకొన్నది" అని చెప్పి
అంతర్థానమైనాడు.

"ఎవరు ఆ అనుగ్రహానికి పాత్రులో, మీలో ఎవరో,
నిర్ణయించండి. కాని ఒకటి మరచిపోకూడదు. ఆమె వితంతు
ఐ వుండాలి. ఇంతవరకును ఏ పురుషస్పర్శను యెరిగివుండ
కూడదు. ఈ విషయమై ఏమాత్రము దోషమున్నా ఆ జ్యోతి
భగ్గున నిలువునా మనిషిని కాలుస్తుంది. ఎవరు యోగ్యులో
వారే అగ్నిగుండాని కెదురుగా నిలబడండి." అన్నాడు.

సభంతా నిశ్శబ్దం. ఎవరూ ముందుకు రాలేదు.

"ఎవరూ! ఒక్కరూ, లేరా?" అన్నాడు.

ఎవరూ లేరా, యీ పుణ్యక్షేత్రంలో ?

బాల వితంతువులను వెతుకుతున్నాయి, సభికుల కళ్లు.

"ఎవరూ రాకపోతే,—"

అంటూ, క్రిందికివాల్చిన కళ్ళతో, వొణుకుతున్న పెద
వులతో, మెల్లిగా వచ్చి నుంచుంది, పున్నమ్మ.

పున్నమ్మని చూచి అందరూ ఆనందపరవశులైనారు.
"ఈ నాటినించి ఆర్నెల్లవరకు నీ వీశ్వరపత్నివి, సుమంగలివి,
ధన్యురాలవు."

అని తానే కుంకుమను ఆమె నొసట పెట్టాడు. పూల
దండలు వేశాడు.

ఆ రోజునించి పున్నమ్మ పూర్తిగా ముత్తయిదు వేషం ధరించింది. ఆ పుణ్యావేషం ఆమెకి కొత్తఅందాన్నిచ్చింది. ఆ ఆర్నెల్లు ఆమెని మధ్య కూర్చోపెట్టి భజనలు, పూజలూ, నమస్కారాలు, నైవేద్యాలూ, ఎగిరిపోతున్నాయి. ఈ వార్త వ్యాపించి అనేక ప్రదేశాలనించి ప్రజలువచ్చి చూచి పోతు న్నారు. విచిత్రంగా ఆమెకి గర్భచిన్నాలన్నీ కలిగాయి. తీర్థులు కూడా ఆమెకి నమస్కారాలూ, పూజలు సాగించాడు. తనకి చాకిరీ చెయ్యనీడు. తన శుశ్రూషకి రాత్రులు వుండనీడు. రోజూ అందర్నీ కూచోపెట్టి, ఆ అవతారకన్య చెయ్యగల ఘన కార్యాలనూ, పునరుద్ధరణనూ, గురించి పెద్ద వుపన్యాసా లిస్తున్నాడు. త్రిలోకాలూ సంతోషిస్తున్నాయనీ, దేవతలు మంగళహారతులతో వొచ్చిపోతున్నారనీ, పూలవర్షాలు కురు స్తున్నాయనీ; కాని అవిశ్వాసకులు ప్రబలం కావడంచాతా, మ్లేచ్ఛప్రభుత్వం కావడంచాతా, ఆ వుత్సవాలన్నీ ప్రజల కంటబడేటట్టు చెయ్యటం లేదన్నాడు.

ఆఖరికి తీర్థులు చెప్పినట్టు ఆరోనెలకూడా నిండకుండానే నొప్పులువొచ్చాయి. ఈ వార్త వ్యాపించగానే చుట్టుప్రక్కల ప్రజలందరూ వేలకొలది పోగైనారు. ఒకటే భజనలు, ప్రార్థ నలు. వీళ్లైనంతమంది స్త్రీలు గదిలో పలచేరారు. నాలుగుగం టలు శ్రమ పడ్డతరవాత "ఉదయించిందిఉదయించింద"న్నారు. ఉత్పాతాలు జరుగుతాయో, యేలోక శుభశూచకాలు కలుగుతాయో, తమ కళ్ళు భరించగలవో లేదో అని అందరూ కళ్ళుమూసుకున్నారు.

ఎంతకాలం కళ్ళుమూసుకున్నా యేమీ జరగలేదు. కళ్ళు తెరిచారు. గదిలోవాళ్ళు బిడ్డని చూపరు, మాట్లాడరు.

చివరకి తీర్థులువొచ్చి—

'నాకు తెలీకుండా దేవికి ఏదో అపచారంజరిగింది. కనక అవతారం వుపసంహరించుకుంది. జపంచేసి కనుక్కొని చెపుతాను" అని మళ్ళీ కనపళ్లేదు. ఆ వ్రాళ్ళో చివరికి పుట్టినపిల్లని చూస్తే కదలడంలేదు. దానికి మొహమంతా గుంటలు. ఎవరో డాక్టరొకడుండి—"యిది సిఫిలిస్" 'పిల్లరా' అన్నాడు.

---

# ఎదగనేలేదు

గోదావరి యిసికలంకల వెనక సూర్యుడు అస్తమిస్తున్నాడు. నల్లని నీడమీద, తెల్లనితెరచాప తేలిపోతోంది. వూళ్లోంచి బిందెపట్టుకుని ఒక అమ్మాయి మా రేవువేపు వొచ్చింది. మమ్మన్ని చూసి కళ్ళుదింపి మీతో నాకేమీ సంబంధంలే దన్నట్టుదూరంగా వొంపు తిరిగి రేవులోకి దిగింది. ఆమె వొళ్ళు సన్నం. యేళ్ళు పద్దినిమిది వుండవు. కళ్ళల్లో బండీకి కట్టే యెద్దుకి వుండే 'యింక యీచాకిరీ, బాధా తప్పవనే' నిరాశతో కూడిన దీనమైన చూపు వొళ్లంతా జాలి వలె కిందికి వేళ్లాడిపోయింది. అంత సన్నని వొళ్ళు అట్లా జారిపోతే, చాలా అసహ్యం వేస్తుంది; ఎంత అన్యాయం జరిగిందో అని, విచారం కలుగుతుంది. బిందెలో నీళ్ళుముంచి, యెత్తబోయి ఆయాసపడి, కళ్ళు కిందికివాల్చి నుంచుంది. ఎవ

రన్నా ఆడవాళ్ళు వొస్తున్నారేమోనని చూసింది. ఎవరని అలలు బిందెని ప్రశ్నిస్తున్నాయి. రామ్మూర్తి మెల్లిగా లేచి బిందె పట్టుకుని ఆమె బుజానికెత్త బోయివాడు. కాని ఆమె చప్పున పక్కకుతిరిగింది, • బిందె నక్కడే పెట్టి వెనక్కివొచ్చి కూచున్నాడు. ఆమె అభిమానం యెక్కువై ముందు ఆనీళ్లన్నీ పారపోసింది. మాకు కులం లేదని తెలుసునా అనుకున్నాను. మళ్లీ ముంచుకుని, కష్టపడి మోకాలుమీద మోపుకుని, ప్రయత్నించి బుజాని కెత్తుకుంది. ఆబిందె బరువు కింద యే నిమిషాన ముద్దగా కూలుతుందో అనిపించింది నాకు.

సూర్యుడు బ్రిడ్జి వెనకాల ఇసికదిన్నెలలో అస్తమిస్తు న్నాడు, నీటికాకులు మా నెత్తిమీదిగా యెగిరిపోతున్నాయి. నిరాశలో గోదావరినీళ్ళు వొడ్డున తపుకుమని కొట్టుకుంటు న్నాయి. మా హృదయాల్లో చెప్పలేని భీతితో కూడిన దిగులు కలిగింది, జీవితంలోని నిరాశలూ, నిష్ప్రయోజనమూ, కష్టమూ, అంధకారమూ, అన్నీ మనసుల నావరించాయి.

వుండుండి రామమూర్తి,

"వాణ్ణేంచెయ్యాలంటావు?" అన్నాడు. ప్రేమించి ప్రేమించి, ఒకరవ్వ సాఫల్యము నెరగక అల్లానే చచ్చి పోయినవాళ్ల గంభీరమైన బాధనిగురించి యోచిస్తున్న నా మనస్సుని తిప్పి, నేను

"యెవర్ని?" అన్నాను.

"ఆ అమ్మాయిని యీవిధంగా చితకకొట్టిన రాక్షసుణ్ణి"

"యెనిమిటి నేనా?"

"మూడేళ్ళల్లో చూడు, ఆఅందాన్నంతా—ఆ...అం... దా...న్నం... తా ... ఆ లావ...ణ్యాన్ని ... కోమ... లత్వా...న్ని..."

"ఎరుగుదువా యేమిటి?" •

రామ్మూర్తి నామాట వినిపించుకోలేదు. అతని దృష్టి యెక్కడో జ్ఞాపకంలో వుంది.

"బడినించి నవ్వుతో పరిగెత్తుతో వెడుతోండేది, లేడి పిల్లలాగు- గంతులేస్తో, నవ్వుతో, యిటూ అటూ సంతో షంగాచూస్తో,...పైకెతిరిగిన చిన్న ముక్కూ-అమాయకపు చిన్ననోరూ-

"ఆ పిల్లేనా, యీమె!"

"ఎదిగింది చక్కగా కోమలంగా యెదిగింది. మామిడి గున్నలాగు పెద్ద జుట్టు- నున్నగా గుండ్రగా మెడ—జుట్టు ఆరబోసుకుంటే కనపడేది. ఆచేతులో! పాపం, పాపం అంత అందంగానూ పెరుగుతుం దనుకున్నాను. అట్లానే కలకల నవ్వుతోనే, ఎండలో నుంచోడమే వీధి వంక చూడ్డమే ఆనందమైనట్టు, చూసేది. యింకేం? అందుకున్నాడు వాడు! బతకగలడా ఆ మెని నలిపెయ్యకుండా? దేహాన్నే కాదు-ఆమె అందాన్ని, ఆనందాన్ని, మెదడుని, స్వేచ్ఛని జీవాన్ని, కొరుక్కుతిన్నాడు. పీల్చాడు, పిప్పి చేశాడు. అయ్యో! ఆ హృదయాన్ని, కత్తితో పెల్లగించి తినేశాడు. ఆ కళ్ళలో ఆ శూన్య దృష్టిని, నిరాశని, భీతిని, చూశావా? ఏంచెయ్యను వాణ్ణి?"

"లేవతీసుకుపోదాం" అని నాకు తెలిసిన ఒక్క-సూత్రాన్ని అనేశాను.

"ఎవర్ని ?"

"ఈ మెని."

"ఎందుకు ?"

"వాడు యేడ్చి చచ్చేందుకు."

"చాలా సంతోషిస్తాడు. ఇక యీామె యెందుకు వాడికి! ఇంకెవర్ని పట్టి చీల్చుకు తింటున్నాడో ! రాక్షసుడు! ఈ శవమెందుకు వాడికి ?"

రామ్మూర్తి కోపంతో లేచాడు.

"వాడి కేమధికారంవుంది, అందాన్ని యిట్లా నాశనం చెయ్యడానికి! ఒక మంచిపటాన్ని చింపితే తంతారే, బతికివుండి, హృదయముండి, రోజురోజు కొత్తగామారే ఆమె సౌందర్యాన్ని—యేచట్టప్రకారమూ ఏమీాచెయ్యరూ? హృదయము చీల్చుకుతింటే యేమీాచెయ్యరూ! గొంతుక పిసికితే వురితీస్తారే ? ... కలవకాడ నీళ్లలోంచి కాంతివేపు వెంపుతిరిగినట్టు వుండేది ఆమె మెడ, ఆయవ్వనం మొదలు పెట్టినప్పుడు మెలిపెట్టాడు, తుంపాడు, దరిద్రుడు—"

సూర్యుడు అస్తమించినచోట యెర్రగావుంది. గోదావరినీటిమీాద నలుపుకమ్మింది. నల్లని కాళినాలుకలవలె నీళ్లు వొడ్డుని కోపంతో నాకుతున్నాయి.

నాలుగురోజుల తరవాత గోదావరి వొడ్డున ఆచోటనే శవంచుట్టూ మనుషులు కూడారు సాయంత్రం. గుంపులోకూడి దూరి, చూసివొచ్చాడు రామ్మూర్తి. మొహం అంతా తెల్ల

బడ్డది. కళ్ళుమాత్రం మెరుస్తున్నాయి చేతులూ పెదిమలూ వొణుకుతున్నాయి.

"అదే ఆపిల్లే, చంపారు. చంపాడు"

అంటూనే ఆగుంపుని నెతికి ఒకడిమీద దృష్టినిలిపాడు: రాక్షసుణ్ణో, ఘాతకుణ్ణో చూసినట్టు చూస్తో, చిన్నకళ్లు పెద్దవి చేసి, నా చెయ్యి గట్టిగా పట్టుకుని,

"వాడే, వాడే" అన్నాడు.

"ఎవరు?"

"దాని మొగుడు."

ఇంక ఆలస్యమైతే యింకోహత్య జరుగుతుందని భయపడి, బలవంతంగా అతన్ని లాక్కుపోయి దూరంగా యిసిక మీద కూచోపెట్టాను.

దాహమై వచ్చిన గబ్బిలం సొమ్మసిలి నీళ్ళమీద పడి తన్నుకుంటోంది. నెత్తిమీద యెగిరిపొయ్యే నీళ్ళకాకి జాలిగా అరిచింది. నలుపు రెండో వొడ్డుని మింగేసింది.

ఒక్కమాట మాట్లాడ్డంకూడా సహించని దిగులులో యిద్దరమూ కూచుని వున్నాము.

శవంచుట్టూ వున్న గుంపు చెదిరిపోయింది. మసకలో ఒకమనిషి అల్లా నడుస్తో మావేపు వచ్చి, మాకు కొంచెం దూరంలో కూచున్నాడు. రామ్మూర్తి చప్పున తలెత్తి అతన్ని చూసి

"ఎందుకు చంపావు?" అని అడిగాడు.

"నేనే చంపానా ?" అన్నాడు అతను, మాతోకాక, తనని తనే ప్రశ్నించుకున్నట్టు.

"నువ్వే! ముమ్మాటికీ నువ్వే! ఈలోకంలో నీకు శిక్ష పడక పోవొచ్చు..."

"నేనేనా! నేనే ఐతే శిక్షపడతాను. పడనుమరి! ఇంకా సందేహిస్తావేం?—"

రామ్మూర్తి లేచాడు.

"ఏంచేశావు? చెప్పుముందు. ఏంచేశావు? నీచేతులతో నువ్వేతోశావా? ఆమెఅంతట ఆమె పడ్డదా, హింసించావా? దుర్మార్గుడా, పశువా?"

పెద్ద పోట్లాట జరుగుతుందని భయపడ్డాను. కాని తిట్లనీ, చివాట్లనీ లక్ష్యపెట్టే స్తితిలోలేడు అతను. ఆశ్చర్యంతో ప్రశ్నార్థకంగా నావంక చూశాడు. నేను రామ్మూర్తిని కూచోపెట్టాను. ఆ భర్త వాలకం చూస్తే భయంకన్న విచారం ఎక్కువలాగు కనపడుతోంది. అతను నిర్దోషిఅని అనుకున్నాను, అతనిమీద జాలి కలిగింది. సానుభూతి కోసం వెతుకుతున్న వాడివలె కనపడ్డాడు.

"ఇక్కడ వుండవద్దు ఛీ, పోదాం, రా" అంటున్న రామ్మూర్తిని లక్ష్యం చెయ్యక, ఆ భర్త పక్కన కూచుని-

"ఎందుకు చచ్చిపోయిందో తెలుసునా?" అనిఅడిగాను.

"తెలుసునో, తెలీదో, తెలీటంలేదు"

"తెలీదూ! ఎందుకు తెలుస్తుంది నీకు-" అని యింకా యేదో దూషించ బోతున్నాడు రామ్మూర్తి.

"నన్నెరుగుదురా! ఎందుకంత ఆగ్రహం!"

"ఎరుగుదునా! ఎరగాలా! ఆమెని పాపం, చిన్నపిల్లని, నలిపి, చీల్చి, పీల్చి, పీనిగనిచేసి, యింక వేరేచంపాలా?

నిజంగా చంపి తేనేం చంపకపోతేనేం? నీ మొహం చూస్తే నే పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి."

ఎవరమూ మాట్లాడకండా కూచున్నాము. నేను దయగా-

"ఎందుకు గోదావరిలో పడ్డది?" అన్నాను మళ్ళీ.

"పొద్దుణ్ణించి అందరూ నన్ను ఘ్రొదార్చినవారే. కాని అందరికీ మనసుల్లో నేనే చంపానని వున్నట్టుంది. నేనే కారణ మని నమ్మకం. ఈయన యెవరో పైకి అన్నాడు. అంతే భేదం. కాని నేనే కారణమా అని ఆలోచిస్తున్నాను.—"

"ఇంకా ఆలోచించాలా! నువ్వు కాకపోతే యింకెవరు, ఆమె కళ్ళల్లోకి ఆ హృదయభేదకమైన చూపు తెప్పించింది?"

రామ్మూర్తి మాటల్ని లక్ష్యంచెయ్యక అతను చెపుతున్నాడు.

"మొదటినించీ మేము చాలా ప్రేమించుకున్నాము. ఆడవాళ్ళ వొంటిఅందమంటే నాకుచాలాతృష్ణ. ఇదిచాలా అందమైనది. కాని వికారరూపాన్ని నేను భరించలేను. అందాన్ని చూస్తే, అందాన్ని చేత్తోతాకితే, యింక నా వొళ్ళునాకు తెలీదు. దానికీ నామీద చాలా మోహం వుండేది."యువ్వనవుధృతంవల్ల, యింక మేము వొకర్ని వొకరం నలిపి, పీల్చి, రాత్రులు, పగలు యెంతో అనుభవించాము. అందుకోసమే ఒకరికోసం ఒకరం బతికాము. భోజనమూ, అనుభవమూ, శక్తిని పోగొట్టుకోడమూ, మళ్ళీ సంపాయించడమూ, యిట్లా రెండు మూడు సంవత్సరాలు బతికాము. కాని అది రెండునిమషాల్లా గుండినామనసులో. యెండాకాలపు రాత్రులు, జోరుమనే వాన

లో గదిలో మేము వెచ్చగా క్రీడించిన ఆనందాలు, ఒకరినిఒకరం గాఢంగా ప్రేమించి గాయపరచడం—అట్లాంటి ఆనందం జీవితానికల్లా ఒక్కసారే కలుగుతుంది. కాని క్రమేపీ అది నా చేతుల్లో నలిగి, వేళ్లాడిపోవడం, నా కళ్ళు గుర్తుపట్టాయి. నేను గట్టిగా వాడుకునే స్తలము ప్రతిదీ కృశించింది. వాడిపోయి ముడతలు పడ్డది. నేనుమాత్రం అట్లానే వున్నాను. నా శరీరం యింకా అందంగా తయారయింది. దాని ముద్దులలో కౌగిలింతలలో—"

"పశువా ?"

"నే నేంచేశాను ? దాని కోరికా నాకోరికా ఏకమైనాయి. కాని సృష్టి స్త్రీలయడల క్రూరమయింది. పువ్వులో అందం ఒక్క నిమషంలో నశిస్తుంది. రాయి మెరుపు అట్లానే వుంటుంది. మన మేంచేస్తాం ?"

"పెద్దవాడివి, ఆడదాని సౌందర్యాన్ని ధ్వంసం చెయ్యకూడదని తెలీదూ ?"

"ఎట్లా తెలుసు! మీరు చెప్పారా? ఎవరైనా వొద్దన్నారా?" మా మోహాన్ని చూసి, చాలామంది అసూయపడ్డారు. ఇంతలో దానికి గర్భంకలిగింది. అదివరకు దానిచేతులు సన్నపడ్డా రొమ్ము కృశించినా, అద్దమువంటి దానిపొట్టనీ విల్లువంటి దాని నడుమువొంపునీ చూసి తృప్తిపడేవాణ్ణి. కాని ఆ నడుము సాగి, పొట్ట పెద్దదై, ఆ మొహంకూడా వాడేటప్పటికి, దానివంక చూడ్డమే కష్టమయింది. పూర్వపు ప్రేమతో నాదగ్గిరికి వచ్చేది. కాని చూడలేక కళ్లు తిప్పుకునే వాణ్ణి. అది తాకితే జెర్రులుపాకినట్టుండేది. దాంతో

పడుకోవలసి వొస్తుందని, స్నేహితుల యిళ్ళల్లో వుండేవాణ్ణి తనమీద ప్రేమ పోయిందని యేడిస్తే యేమనను? పోయింది. ఇంక రాదు. తన తప్పిదమేమని అడిగేది. ఏముంది?"

"అంతా నీ తప్పిదమే." అన్నాడు రామమూర్తి.

"నాదా? నాకెంతో దిగులేసేది. నాకు ఏడుపొచ్చేది దాన్ని అట్లా కష్టపెట్టడం. కాని ఏమీ చాతనయ్యేదికాదు. దాన్ని లాలించడం నా చివరికి సాధ్యంకాలేదు. చీదరించుకున్నాను. తిట్టాను, దాని మోహాన్ని భరించలేక, ఏమీ లేనిదే ఎవరో నాకు ముండలున్నారన్నాను. రెండురోజులు కోపంతో మూతి ముడుచుకుంది, నేను బతిమాలుకుంటానని అది అనుకుంటే, నన్ను వొదిలిందికదా అని నేను సంతోషించాను. కాని "పోనీ, క్షమించానం"టో వొచ్చింది. ఇంక భరించలేక తన్నాను- పోయింది- దాన్ని యెంతో హింసించాను. కాని యెంత ప్రయత్నించినా నాకు ఆ అసహ్యం ఆగలేదు. ఆ గర్భిణీ స్త్రీని కొట్టటం ఎంత పేగులు తరుక్కుపోయినా, పశ్చాత్తాపం చూపానా, నన్ను పట్టుకుంటుందని భయం. అంత దుఃఖమూ లోపల అణుచుకుని, జాలిని చంపుకుని, కోపంగా కనపడేవాణ్ణి. ఒకనాటి రాత్రి, అది యెంత ప్రేమతో లేపినా, మాట్లాడకకండా పడుకుంటే, పాపం, విసుకెత్తి,

"పోనీ, కొట్టండి. అదే బావుంటుంది" అంది. ఎంత యేడ్చానా రాత్రి! పూర్వపు ప్రేమ జ్ఞాపకం తెచ్చి యేడిపించేది! ఓహో మేము గడిపిన రాత్రులు, మాసరసాలు, మానవ్వులు! యేమైనా యేమో! దానిపాదాలదగ్గిర కూచుని "నువ్వు నా రాణివి. నా హృదయేశ్వరివి. ఈ బతుకంతా వెలిగించావు. నువ్వు

లేనిది ఒక్క నిమిషం బతకలేననడం జ్ఞాపకమొచ్చేది. ఏం చెయ్యనూ, "అన్నీ దొంగమాటలేనా," అని అది అడిగితే పేగులు తరుక్కుపొయ్యేవి. చివరికి ఒకవిధంగా దాన్ని వోదార్చాను. పురుడు కాగానే మళ్లా అందంగా వుంటుందనీ, ఆ గర్భిణి నెలలలో మోహం ఆరోగ్యం కాదనీ చెప్పాను. నమ్మింది కొత్తసంతోషం వొచ్చింది. కలకలనవ్వింది. ఎంతో ప్రయత్నించినా దగ్గిరికి రాలేదు, అటుతరవాత.

ఒకనాటి రాత్రి దానికి నరాలు పట్టుకున్నాయి. మా అత్తా, దాని చెల్లెలూ, వొచ్చి పడుకున్నారు: రాత్రి అవసరమొస్తుందేమోనని, అదీ, దాని చెల్లెలూ పట్టెమంచంమీద పడుకున్నారు. దానిపక్కన కింద చాపేసుకుని మా అత్త పడుకుంది. కొంచెం దూరంగా కిటికీదగ్గిర నులకమంచంమీద నేను పడుకున్నాను. ఇదంతా యెందుకు చెపుతున్నానంటే అంతా కర్మ, కర్మ తోసుకువొస్తుంది. మనం బుద్ధిపూర్వకంగా చేసేది తక్కువ. మా గదికి ఒకటే కిటికీ. అది రోడ్డుమీదికి తెరుచుకుంటూంది. మూసుకుంటే గాలిరాదు. అందుకని దీపం లేకండా చీకట్లోపడుకోడం మామూలునాకు. రాత్రి దాహమై మెళుకువవొచ్చింది. చెంబుకోసం వెతుకుదామంటే మా అత్త మధ్య యెక్కడో పడుకునివుంది. పడుకున్నాను, కాని నిద్ర రాదు. అత్తని పిలిస్తే అది లేచి మళ్లీ మూలుగుతుందని భయం. నిద్రపోకపోతే మర్నాడు ఆఫీసులో నిద్రా, పోష్టుమాష్టరు కోప్పడ్డం, జ్ఞాపకమొచ్చి, లేచి కూచ్చున్నాను.మంచం మెల్లిగా దిగి, నేలమీద జరుగుతో, చెంబుకోసం వెతికాను. ఇటూ అటూ తడిమాను. నా వూపిరి బిగ్గిరిగా నాకే వినబడుతోంది.

మా అత్తని తాకి యెక్కడ తడుముతానో అనిభయం. ఆమె యేమనుకుంటుందో, ఇట్లా అనుకుంటూ వుండగానే, నా చెయ్యి సరిగా గుండ్రని వెచ్చని, ఆమె రొమ్ముమీద పడ్డది. భయంతో వొణికాను. అరుస్తుందో, తిడుతుందో, కావలిసే చేశానంటుందో! చెయ్యి చప్పున తియ్యబోయినాను. ఆమె నా చెయ్యి నక్కడే పట్టుకుని ఆపింది. నిజంగా చెపుతున్నా, ఆమెమీద యెప్పుడూ అట్లాంటివుద్దేశం నాకు లేదు. ఆ నిమ షానా యేమీ కోర్కె కలగలేదు. కాని ఆ అవస్థలో ఆమె చెయ్యిపట్టుకుంటే నే నేంచెయ్యను? నా వుద్దేశ్య మదికాదని యెట్లా చెప్పను? ఆమెమీద నాకు చాలా గౌరవం. అది గాక ఏమాత్రంమాట్లాడినా, వాళ్ళిద్దరూ వింటారు. ఆమర్నా డూ అత్త ఆ గదిలోనే పడుకుంది. ఈసారి నన్ను లేపి తన పక్కమీదికి తీసుకు వెళ్ళింది.

ఎవరితోనన్నా యీ వ్యవహారమంతా, యీ నాబాధ నంతా చెప్పుకోవాలని యీ వార్త విన్నప్పణ్ణించి అను కుంటా. ఎవరితో చెప్పినా, చెప్పుతీసుకు కొడతారని భయం మీరేమనుకుంటున్నారో? యేమన్నా అనుకోండి తీరా చెప్పేశాను.

మాఅత్తతో చాలా సౌఖ్యపడ్డాను. నాచేతుల్లో నిండి పొయ్యేది. నాభార్య అందమే గాని, యెక్కడ గట్టిగా నొక్కితే విరుగుతుందో అనిపించేది. అప్పణ్ణించి అది యెదగనే లేదండి—"

"ఎవరితప్పు?" అన్నాడు రామ్మూర్తి పెంకెగా.

"ఇది కన్నది కన్నాక మళ్లీ నాకోసం వొస్తే నాకేమి మనస్కరించలేదు. రోత అనిపించేది. మాఅత్త 'అమ్మాయీ' బుల్లెమ్మా!" అంటే, నాకు అమ్మాయి లాగే కనిపించింది. ఎంతో ప్రయత్నించాను. చాతకాలేదు "ఇప్పుడు మునపటి మల్లేనే వున్నాగా!" అంది. దాంతో నా పేగులు తరుక్కుపోయి, యేడ్చాను. అది ప్రేమ అనుకుని, ప్రేమతో నన్ను సమీపించింది. ఆరాత్రంతా అత్తదగ్గిరికి వెళ్దాం అని చూస్తున్నాను. భార్యకి దడిశి వారంరోజుల నుంచి ఆమెని చూడలేదు. గంటసేపు భరించాను. ఇంక ఊపిరాడ్డం దుర్భరమై దాన్ని ఒక్కతోపు తోసి, రెండుతిట్లుతిట్టి బైటికి వెళ్లాను. నాశరీరమంతా మలినమైనట్లు, ఏదో వికారమైన పాపం చేసినట్లు, తోచి, నన్నాగతికి యీడ్చినదానిమీదికోపంపట్టలేక, వెనక్కి వెళ్ళి,

"ఈసారి నన్ను తాకావా నిన్ను చంపేస్తాను కుళ్ళుముండా! నిన్ను చూస్తేనే డోకు," అని వెళ్లిపోయినాను. తెల్లారేప్పటికి చచ్చిపోయింది యీనదిలోపడి.



# ౭. భాష న్నా తె లీ దు

"నేను కొవ్వూరులో పెద్దబోగీలో యెక్కాను. నిండా ప్రజ లున్నారు. కూచోడానికి చోటు లేక తలుపు దగ్గిరిగా కూచున్న ఉత్తరహిందూస్తానంవాళ్లని మూటలు తీసి జాగా చెయ్యమని సౌజ్ఞ చేశాను. తియ్యడానికి వీల్లేదని ఆపాడు

భాషలో గోలచేశారు. నాకు కోప మొచ్చి మూట లెత్తి కిటికీలోంచి పారేస్తా నని దడిపించాను. ప్రాణం పోతున్నట్టు అరుస్తో చేతు లడ్డంపెట్టి లేచా డోముసలివాడు. వాడిపక్కన వున్నపిల్లకళ్ళు వాడిగోలని చూసి నవ్వుతున్నాయి. నోరు మాత్రం కళ్లతో సంబంధం లేకుండా యేదో అరుస్తోంది. సరదా పుట్టి ఆ మూట నక్కడే పడేసి ఆ స్తలంలోకూల పడ్డాను. తరవాతకూడానా మొహం చూస్తో ఆకళ్ళునవ్వుతోనే వున్నాయి. కాని ఆనోరుకోపంగా గొణుగుతోంది. నల్లగా నిగ నిగ కళ్ళమీదా చెంపలమీదా, జీరాడేజుట్టూ, ఆంధ్రదేశములో యెక్కడా కనపడని పొడుగూ చురుకూ ఐనముక్కూ, మూర్ఛల్లో మాతలు పడుతున్నకళ్ళూ, ఆమె మొహాన్ని చాలా ఆకర్షకంగా చేశాయి. గట్టిగా బిగించినరొమ్ము, గుండ్రని గట్టితొడలూ, నున్నని బుజాలూ, నూమ్ముకొట్టిన బట్టలు కూడా దాచలేకపోయినాయి. మరీ తేరపార చూస్తే పోకిరిగా వుంటుందని తన నెత్తిమీదనించి యేంచూస్తున్నానా అనీ ముసలాడు అనుమానపడతా డేమోననీ "బ్రౌనింగ్" తెరిచి నామనసుని బంధించాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఆనవ్వుతో మాయిద్దరికీ యేర్పడ్డ రహస్యస్నేహం నామనసుని కొంచెం కదిపెడుతోనే వుంది. షర్టుకింద నాబుజం చక్కలిగింత 'ఖీల'యింది. ముసలాడు నాశబ్బులకోసం వెతుకుతున్నాడా అని చప్పున పక్కకి కళ్ళుపాల్చి చూశాను. బల్లులలాగు రెండు పల్చనివేళ్లు నాబుజానికీ అనుకునేబల్లకీ మధ్య నున్నాయి. మెరిసే రెండు గోళ్ళు ముఖాలెత్తి నన్ను చూసి నవ్వాయి. ఆ వేళ్లకి చెందిన చెయ్యి ముసలివాడి వెనకనించి నావేపు చాచుకుని వుంది.

యిటునించి ఆమెవంక చూశాను. గోదావరీ నీలజలాన్ని కళ్లలో ప్రతిఫలింపచేస్తో, స్వదేశ పరత్వగంభీరత్వస్ఫురణలో మమ్మల్నీ రైలునీ మరిచి ఏమెరగనట్లు కూచుంది. మెల్లిగా వేళ్లు నా మెడనీ, నావీపునీ ప్రేమతో తాకి, నాచేతుల్ని పట్లు వొదిల్చాయి. తిరిగితిరిగి ఒక్కచిరునవ్వుకై ఆమెముఖాన్ని వెతికాను. పైకి తిరిగిన ఆమె పెదవిలో ఒక్కమార్పూ లేదు. ఆమెవేళ్ళని వీపుతో నొక్కాను. మెల్లిగా చేతిని జాచాను. కాని ఆవొడుపూ ఆనేర్పు మొగాడికి నాకు చాతనవుతుందా? ముసలివాడు చప్పున తిరిగి చూశి ఆమెతో కోపంతో యేదో ఒక్కమాట అని వూరుకున్నాడు. గోదావరిలో రైలాగగానే మూటలు పట్టుకుని కిందికి దిగి ఆమెని దిగ మన్నాడు. ఆమె దిగ నంది. కోపంతో కేకలేశాడు. తన స్తలంనించి కదలక యేదో వాదిస్తుంది. యిట్లా రెండునిమిషాలు గోలపడి మూటలు కిందపారేశి, లోపలి కొచ్చి దాన్ని జుట్టుపట్టుకుని బర బర యీడ్చాడు. యిద్దరుముగ్గురు సగంసగం అడ్డపడపోయి తమ కెందుకని వూరుకున్నారు. పడుచు దానికోసం పోట్లాడడం అందరికీ యిష్టమే కాని భయమే, సిగ్గే. కిందికి లాగి గుండెలో గుద్ది, మూటలు దానిమీద పడేసి నడిపిస్తున్నాడు. ఒక్కనిమిషంలో మేమూ నలుగురైదుగురం కిందికి దిగాము. తక్కిన వాళ్లకి తమాషాగా వుందిగావును. కాని నా కాముసలాణ్ణి తన్ని, ఆమెని వొదిలించా లని అణుచుకున్న కొద్దీ తుపాను లేస్తోంది. నావంక నవ్వినచిరునవ్వు, నాబుజాల్ని తాకించిన మాధుర్యం, నాకోసం నావల్ల ఆమె పడుతున్న బాధ—కాని నేను పోట్లాడితే వీళ్లందరూ యేమనుకుంటారు?

మధ్య నీకెందు కంటే యేంచెప్పను? అదిగాక యీపిల్లకి మాత్రం ధైర్య ముంటుందా? వాడివేపే పలకదా? ఆమె చూపులు చూస్తేమాత్రం వాణ్ని ఆక్షణానకాల్చేట్లో, కత్తితో నరికేట్లో వున్నాయి. రాజమండ్రి స్టేషన్లో దిగి, వెళ్లి చూశాను యింజనుపక్క పెట్టెలో వున్నారు యిద్దరూను. నన్ను చూసి, ఆదరణగా జాలిగా, ముఖం పెట్టింది. యేంచెయ్యను? వెనక్కి వొచ్చాను. కాని యిట్లాంటివాడితో ఆమె యెంతబాధ పడుతోవుండాలి దినదినమూ? చెప్పగు నేందుకు, అర్థం చేసుకు నేందుకు, తనభాషైనా తెలిసినవాళ్లు లేక యీ పరదేశంలో వాడు చంపుతూవుంటే—యింకా యేంచేస్తాడో? యెక్కడికి వెడుతున్నారో? నామీద యెంత ఆశ పెట్టుకుందో? యెంత విశ్వసించిందో? కనుక్కుంటే? వెళ్లి వాళ్ల పెట్టెలో యెక్కి యెదురుగా నుంచున్నాను. చప్పున నురుగులుకక్కుతో లేచి మూట్ల నొకచేత్తో, ఆపిల్ల జెబ్బ నొకచేత్తో పట్టుకొని దిగాడు. పక్కనున్న ఆడవాళ్ల పెట్టెలోకి ఆమెని తోసి, తను యింకోపెట్టెలో యెక్కాడు. కడియందాకా నామనసు మనసులో లేదు. ఆస్టేషన్లో వెళ్లి ఆమె కెదురుగా ప్లాట్‌ఫారంమీద నుంచున్నాను. లోపలి దీపాలవెలుతు రింకా బైటికి పడటం లేదు. పొలాలమీద చల్లనిగాలి వింతగా రైల్ని యిదేమి వొస్తువా అని అనుమానంతో తాకి చూస్తోంది. స్టేషనుమాష్టరు యింట్లోంచి పొగ మెల్లగా వేస్తోంది. చంద్రకాంతపువ్వులు విచ్చాయి. బళ్లవాళ్లు అరుస్తున్నారు బేరాలకై. కిటికీలోంచి జార్చినచెయ్యిని పట్టుకున్నాను. ఆమెవేళ్లు నావేళ్ళపైన బిగుసుకున్నాయి. గంట

కొట్టారు. ఆవేళ్లు వొదలలేను. నాకళ్లు ఆమెమొహంనించి
పొడుగాటిరోడ్డువేపు తిరిగాయి. దయగల ఆవేడివేళ్ళని పట్టు
కుని లోకమంతా యెంతదీర్ఘప్రయాణం చేస్తేనేం? రైలు
కదులుతోంది. కొంచెంనడిచాను. ఆగి ఆచెయ్యిని పట్టుకునే
వున్నాను. రైలు ఆమెని లాగింది. ఆపెట్టెలో ఆమెకాక
యింకో ముసలమ్మమాత్రమే వుంది. నేనూ యెక్కితే నేం?
అని చెయ్యిని అట్లానే పట్టుకుని రెండోచేత్తో తలుపు తెరి
చాను. అది చూసి ఆమె చప్పున లేచి తలుపుకి అడ్డంగా
నుంచుంది, రానీను. నాప్రాణం చివుక్కుమంది, నే సింకా రైలు
వెంటనడుస్తున్నాను వెనక యెవరో కేక వేస్తున్నారు. చప్పున
నాభుజంమీద చెయ్యేసి ఆమె నాపక్కకి దూకింది. అమ్మా,
భాష రాకపోవడంవల్ల యెంతప్రమాదం జరిగింది! నేను తనని
దిగమని తలుపు తీశాననుకుంది. ముసలాయనా, మూటలూ,
నాట్రంకూ, దాంట్లో నాభార్యనాగ శ్రేత్తులూ, నా యల్. టీ.
సర్టిఫికేటూ, నాకాకినాడప్రియురాలి వుత్తరాలూ, అన్నీ
దూరంగా, యెర్రదీపంముందు, నన్ను చూచి భయపడ్డట్టు పరి
గెత్తుతున్నాయి. నిర్విణ్ణుణ్ణాయి ఆమె మొహంవంక చూస్తో
నుంచున్నాను. మాట్లాడక తెల్లబోయి, చిన్నపిల్లవలె నేనేమం
టానో అని నావంక చూస్తోనుంచుంది. 'కావలిసేదిగానా?' అనీ,
యింకేమో అడగబోయి, నవ్వొచ్చి వూరుకున్నాను. ఆమె
వుద్దేశ్యమేమో తెలీడ మెట్లా? ఎవరికైనా హిందుస్తానీ తెలుసు
నేమో? కాని యీవ్యవహారం యెవరికిచెప్పుకోను? స్టేషన్లో
మనుషు లందరూ వెళ్ళిపోయినారు. మాఆలోచనా సం
ఘంలో చేరతలి వినట్లు ఒక కుంటికుక్కవొచ్చి తోకాడించి

మా మొహాలు చూస్తో నుంచుంది. పడమటనించి తెల్లనిరంగు
ఆమె మొహంమీద పడ్డది. మాపక్కన బస్తాలలోంచి, తాటా,
పచ్చిమిరపకాయలూ కలిసిన వాసన వేసింది. గాలిమనోహరి
పూలు యెండాకాలపు గాలిలో వూగాయి. టిక్కెట్లవాడొ
చ్చాడు. కాకినాడకి కొన్నటిక్కెట్లతని చేతులో పెట్టాను. ఆమెనడి
గాడు. యేం చెప్పను? ఆమె మాట్లాడక నుంచుంది. తెనుగులో
హిందూస్తానీలో అడిగాడు. మాట్లాడలేదు. నావంక తిరిగాడు.
గోల యెందుకని రూపాయ జేబులోనించి తీసి చేతులో పెట్టాను.
రెండు నిమిషాలు మా యిద్దరివంకా చూసి, వెళ్ళిపోయి
స్టేషనుదగ్గిరగా నుంచుని చూస్తున్నాడు. ఆమె ముఖమే చెపు
తోంది మా యిద్దరికీ సజావైన సంబంధం లేదని. మాటన్నా
వీలులేని ఆమెని వెంటేసుకుని నడిస్తే, ప్రజలందరూ యేమం
టారు? యెక్కడికి పోనూ? యేం చెయ్యను? యెంతకాల
మని? తలెత్తి యెవరి మొహం చూడ్డానికీ సిగ్గుగావుంది. కాని
ఆమె నా పక్కన ఆ అమాయకంగా విశ్వాసం వూడిపడే
కళ్ళతో, గుండ్రని చేతులతో, నల్లని జుట్టుతో, ముందు నే
ననుభవిస్తా ననుకునే సౌఖ్యాల ఆశలతో నా పక్కని నుం
చున్నదనే సంతోషంలో, అన్నీ మరిచిపోయినాను. నాబట్టలూ
భార్య సొమ్ములూ, పుస్తకాలూ పోతేనేం? జేబులో యాభై
రూపాయలూ పక్కని యీ పిల్లా వుంది. యింకేం కావాలి?
యీనాడు అట్లా అనుకోనేమో, కాని ఆ నాడు అట్లా అను
కోని వాణ్ణైతే, యెంత నిర్భాగ్యుణ్ణై వుండాలి? నా పెట్టె
కోసం చామర్లకోట టెలిగ్రాం యివ్వాలనుకున్నాను. కాని
నే నెక్కడవున్నానో ముసలాడు కనుక్కుంటే. యేమీ

# పాపం!!!

యోచనలేకుండా స్టేషన్ దాటి యెర్రదుమ్ముతో నిండిన రోడ్డం
బడి ఆమె వెనకా నేను ముందుగా నడిచాము. వూళ్ళోకి వెళ్లడ
మంటే భయంగా వుంది. యెవరైనా యేదో వొకటి అడుగు
తారు. యేం చెప్పను?. చిన్న తోటవుంది రోడ్డుప్రక్కన.
యిద్దరమూ అరటిచెట్టుక్రింద కూచున్నాము. చీకటి పడుతోంది
గోరువంకలు యెదురుగా ఆముదంచెట్టుమీద మాట్లాడుకుంటు
న్నాయి. మా కాళ్ళముందు నీళ్ళమడుగులో బాతులు రెండు
యీత్తున్నాయి. మా నెత్తిమీద బృహస్పతి వుదయించాడు.
నేనామె బుజంమీద చెయ్యేసి ముఖమెత్తి తడిపెదవుల్ని
ముద్దుపెట్టుకున్నాను. లేచాము. బాగా చీకటయింది. దూరంగా
కనపడుతున్న దీపాలవేపు నడిచాము. దోవలో మళ్ళా ఆమెను
దగ్గరగా లాక్కొని పక్కగా వొత్తుకున్నాను. జీవితమంతా
ఆనందంగా కనపడ్డది. తిండి లేకపోతేనేం, యిల్లు లేకపోతేనేం,
ఆ యెండాకాలపు పైరుగాలిలో నక్షత్రాలకింద యే గడ్డిలో
పడుకుంటేనేం? ఆమె జుట్టు నా చేతులమీద జీరాడుతో, ఆమె
మెత్తని చల్లనిశరీరం నాకానుకుని పడుకుంటే నాకేంకావాలి?
దీపాలదగ్గిరిగా వొచ్చాము. అది బోట్లరేవు. యీ బోటులో
యెక్కి వెళితే, యెక్కడికైతేనేం? అయిదు నిమిషాల్లో గది
మాట్లాడి ఆమెని లోపలి కెక్కించాను. మిటాయీ, పళ్లూ,
కొనితిన్నాము. చీకట్లో గదిలో ఆమెపక్కన కూచున్నాను.
మాట్లాడకండా కూచుంది. ఆమె నన్ను పలకరించాలని యెదు
రుచూశాను. ఆమె కదలలేదు. నాకోసం రైలులో అంత
ఆదుర్దాపడ్డమనిషి యిట్లాకూచుందేం? దిగులుగా వుందా?
ఆకలేస్తుందా? యేవూరు? ఆ ముసలాడెవరు?' అని

'అడగాలని వుంది. కాని ఎట్లా ? ఆమెకి నిజంగా నామీద మన సుందనీ, పోనీ, నా పైనే తను యిప్పుడు ఆధారపడి వున్నదనీ, ఆమెకి తెలియచేసేట్టు చెయ్యాలని వుద్దేశ్యపడ్డాను. కిందికి దిగుతున్నట్టుగా జరిగాను, మాట్లాడ్డలేదు. దిగి యిటూ అటూ వెడుతున్నట్టు తిరిగాను. చప్పుడులేదు లోపలికి చప్పునవెళ్ళి విప్పినకోటు వేసుకుని బైలుదేరి, ఆమెవంక చూశాను. వేలన్నా కదిలించలేను. నా కెంతో కోపం వొచ్చింది. అరగంటసే పెక్కడో కూచున్నాను. పడవబాకా వూదారు. లోపల వొచ్చి కూచున్నాను. ఆమె తలన్నా యెత్తలేదు. రైల్లో పోయిన నాగొత్తులకి, 'షా' పుస్తకాలకీ దిగులుదయించింది. మొహం నీళ్ళకేసి తిప్పేసి, ఆమెతో నా కేం సంబంధంలేనట్టు ఠీవిగా. సిగరెట్ కాలుస్తో, కూచున్నాను. పడవ కదిలింది. పడవపక్కన నీళ్లు రొదపెడుతో పరిగెత్తుతున్నాయి. ఆ ప్రవాహంలో నక్షత్రాలు తేలిపోతున్నాయి. గట్లమీది నీడలు గంభీరంగా మూలుగుతున్నాయ. యింక తాళలేక, నా అమ్మాయికేసి జరిగి చెంపకింద చెయ్యేసి మొహం తిప్పుకున్నాను. వేడిగా నీళ్లు నా వేళ్లకితగిలాయి. పాపం ముక్కూ మొహమూ యెరుగని నాతో సాహసంచేసి వొచ్చేసిన యీ ముగ్ధ, యెంత భయపడుతోందో ? భాషన్నా నాకు అర్థం కాదుకద ! నే నేంచేసినా పడవలిసిందేకద ! యింక నాకంటె దిక్కులేక, నన్నే నమ్మిన యీ అబలపైన నామీద మోహం చూపలేదని నిష్కారణ ద్వేషాన్నిపూని, యిట్లా భయపెట్టి బాధించానుకదా, అని చాలా విచారంకలిగింది. ఆమె తలను గట్టిగా నా కదుముకుని "యెందుకు దుఖ్ఖం, నా పిచ్చిపిల్లా !

నిన్ను వొదిలాసనుకున్నావా? నిన్ను వొదిలేస్తానా? నే నున్నానుగా? ం.టా కంఠంలో ప్రాణమున్నన్నాళ్లు నిన్ను వొదులుతానా? యెందుకు విచారం? యిట్లారా." అన్నాను.

యేమనుకుందో ఆ మాటలకి అర్థం; మొహం నాకు వొదిలేసి, ప్రతిమలాగు కూచుంది. యేమేమో మాట్లా డించాను. నాకు తెలిసిన రెండు హిందుస్తానీముక్కలూ, "ఆవ్, జావ్ ఖానా కాయా? కోఁబస్తీ" యివికూడా పలి కాను. అట్లా నేకూచుంది. మళ్లీ యేవో ఆలోచనల్లో పడి నల్లని గట్లకేసి వాటిల్లో మెరిసే మిణుగురు పురుగులకేసి చూస్తో కూచున్నాను. యెదో లాకులవద్ద పడవ ఆగింది రాత్రియిట్లానే గడుస్తోందే? నా పైని యెంతో మోహం చూపవలసిన యీ పిల్ల మూటలాగు మూల కూచునివుందే? నిద్రన్నా పోదు. యింత త్యాగమూ వృధా కావలసిందేనా? నిద్రరాదు. ఆ మోహంవేపే గాలిలో పడవ సాగగానే ఆ మెదగ్గిరకి వెళ్లి చాలా చనువుగా కౌగలించుకున్నాను. మెల్లిగా నా మొహాన్ని నెట్టేసి, తల తిప్పుకుని కూచుంది. యెందు కంతసిగ్గు! మళ్ళీ మళ్ళీ సమీపించాను. రెండు నిమషాలు వోర్చుకొని తరవాత నిరాకరిస్తుంది. మొదట్లో ఆ అభ్యంతరంకూడా ఆకర్షకంగానే వుంది. వృత్తబిడియం. మొగాణ్ణి నేను చొరవచెయ్యకపోతే యెట్లా? వెళ్ళి కామంతో మోటుసరసం ప్రారంభించాను. స్త్రీని ప్రేరేపించేందుకు వాచ్యాయను డేమన్నాడా అని యోచించాను. నన్ను వొదుల్చుకొని గదిబైటికి వెళ్ళింది. యేమి అవసరమోనని కూచున్నాను. యెంతసేపటికీరాదు. వెళ్లి చూస్తే టాపుమీద యెవరో కాపు ఆడవాళ్ళ దగ్గిరగా కూచుని

వుంది. యెట్లా తీసుకురాను లోపలికి? యెవరిని పిలవను? వెళ్లి దగ్గిరిగా కూచుని వాళ్లు చూడకండా చెయ్యిపట్టుకులాగాను. కాని యింకా వాళ్లదగ్గరగా జరిగింది. వాళ్లు నవ్వుతున్నట్టు తోచింది నాకు, అధికకోపంతో వొచ్చి గదిలోకూచున్నాను దాన్ని కాలవలో తొయ్యాలనిపించింది. కృతఘ్నురాలు! అయినా నా చేతుల్లోంచి యెక్కడికిపోతుందిలే! కాని ఆ రాత్రి వృథాగా గడపవలసిందేనా? నా ట్రంకు పోగొట్టుకున్నదీ, 'కాన్ఫరెన్సు'కి వెళ్ళడం మానేసింది, యిందుకేనా డబ్బుతీసుకుని, వాగ్దత్తంచేసి, మోసంచేసి నిరాకరించే భోగం దానిమీదవలె ఆగ్రహం కలిగింది దానిమీద. దీన్నంచేస్తే యేం తప్పు? అనుకుంటో ఆకోపంలోనే నిద్రపోయి, యెప్పుడో వులికిపడి లేచాను నల్లులు కుడుతున్నాయి. సుఖంగా లక్ష్మణరావుతోనూ, అతని చెల్లెలితోనూ, మన్న సుబ్బరావుతోనూ, 'కాన్ఫరెన్సు'లో తిరుగుతో, రామవిలాస్ నాటకాలుచూస్తో వుండవలసినవాణ్ణి, యిట్లా యీ చెక్కలమీద, వొంటరిగా పడి రాజమండ్రివేపు పోతోవుండేగతి పట్టిందికద! యింతమూర్ఖుణ్ణెట్లా ఐనాను? యీ పరదేశికన్య నెట్లా నమ్మాను? స్త్రీలమీద కోపంతో పురాణాల్లో రాసినసంగతులన్నీ జ్ఞాపకానికి వొచ్చాయి. కాని ఆ అమ్మాయి రైల్లో యెంతప్రేమచూపింది! నన్ను నమ్మి, ఆ ముసలివాణ్ణి వొదిలి—యిప్పుడే ఆమె నా పక్కన పడుకునివుంటే—యిరవై కాన్ఫరెన్సులూ, యిరవై సుబ్బరావులూ, ముప్పై స్తానం నరసింహారావులూ, యెందుకు ఆఅనుభవంముందు? నే ననుభవించగలిగి వుండే ఆనందమంతా స్ఫురణకువొచ్చి కోపమొచ్చింది! నన్నుచూసి నాకే జాలి

వేసింది! నన్ను కోరివచ్చిన పిల్లని పోగొట్టుకున్న నిర్భాగ్యుణ్ణి. ఆ ముసలాడిమాత్రం చెయ్యలేకపోయినాను. వాడట్లా జుట్టు పట్టుకుని యీడ్చి గుద్దితే బాగానేవుంది! నేనింత గౌరవంచేసి కోరితే టెక్కు చేస్తోంది. యిట్లాకాదు వీళ్ళని సాధించేమార్గం కార్జన్యమే! బైటికివెళ్ళి టాపుపైకి చూశాను. స్త్రీలందరూ నిద్రపోతున్నారు. ఆమె మాత్రం మేలుకుని కూచుంది. దగ్గిరికి వెళ్ళి చెయ్యిపట్టుకుని మెల్లిగా లాగాను. వెనక్కిలాక్కుంది. నడుంచుట్టూ చేతులువేసి గారాబంచేసి రమ్మన్నాను. వెనక్కి జరిగింది. నాకు చాలా కోపమొచ్చింది. యింత యిష్టంలేంది నన్నెందుకింత మోసపుచ్చాలి? చప్పున జుట్టు పట్టుకుని కిందికి లాగాను. చెక్కమీదికి జారింది. మెడపట్టుకుని ఒక్క తోపు తోశాను. మోకాళ్ళమీద పడ్డది. వ్యవధానమివ్వక వెంటనే లోపలికి తోశాను. తెప్పిరిల్లడానికీ, అరవడానికీ వ్యవధిలేక గదిలో చెక్కలమీద పక్కగా పడ్డది. వెంటనే వెళ్ళి వెల్లకితలా తిప్పి చంకలదగ్గిర చేతులు అదిమి మోహంతో ఆమెను సమీపించాను. చేతులతో బలంగాతోసింది నన్ను. అభ్యంతరమేమో కనుక్కునే వీలులేదు. ఏంచెయ్యను? ఈ పెంకెతనానికి, అన్యాయానికి కోపం యెక్కువవుతోంది నాకు.. నా బలమంతా వుపయోగించి, ఆమెచేతుల్ని విరిచి, అదిమి ఆక్రమించుకున్నాను. కాని బలమైన ఆ చేతులు నాకొకపట్టాన స్వాధీనమౌతాయా? ఆ చీకట్లో యింక నాఅమ్మాయీ నేనూ భీమచకులవలె మల్లయుద్ధం మొదలుపెట్టాము. ఆమెదిరొట్టెలబలం, వరిఅన్నంగాణ్ణి యెంత మొగాణ్ణైతేమాత్రం గెలవగలనా? యేం చెయ్యలేక రోషమొచ్చి, తలకాయి చెక్కల్ని వేసి

కొట్టాను. నా చేతుల్ని తనచేతుల్తో విడతీసి పట్టుకుని, యింక యేంచేస్తావని చూస్తోంది, కళ్ళమీాద పడ్డ జుట్టులోంచి. చప్పున చేతులు వొదుల్చుకుని మళ్ళీ కలియపడ్డాను. వొగరుస్తూ, మధ్యమధ్య మెల్లిగా యేవో అంటోంది తన భాషలో! తిట్లేమో నని నాకు సిగ్గేసింది. మీాద కూచున్న నన్ను తోసేసి లేవబోయింది. యింక నా శక్తి ఆగదని తోచిందినాకు. యింక అన్యాయయుద్ధం ప్రారంభించాను. యిష్టమొచ్చిన బూతులన్నీ నోటినిండా తిట్టుకున్నాను. ఆ పడవచెక్కలన్నీ విరిగేటట్టు వూగాయి. యామైతేనేం నల్లులన్నీ చచ్చివుంటాయి. కింద అసహాయంగా పడివున్న ఆమెని జుట్టంతా పీకాను. బుజాలూ, చెంపలూ, రొమ్ము కొరికాను, గోళ్ళు గుచ్చాను. రవిక ఒక్క వూపుతో చించి ఆ వక్షాన్ని చూసి జయభేరి మోగించి నవ్వాను. నేనుచేసిన గాట్లరక్తం నా నోట్లోనే చిమ్మింది. అరవదు, మాట్లాడదు; పూరికే మెనుగుతుంది. ఆ ముద్దుభాషలో యేమిటో తిడుతుంది. వివస్త్రఐన ఆమెని చూడగానే, నిగనిగలాడే ఆమె తొడలూ, అంటుకునివున్న ఆమె నడుమూ, చూడగానే నాకు మళ్ళీ కోపం పోయి కామ మెక్కువయింది. మళ్ళీ చివరసారి గట్టిగా ప్రయత్నించి, మెలిక వేసి బిగబట్టిన ఆమె చేతుల్ని కాని, కాళ్ళనిగాని కదిలించలేక యెంత ప్రయత్నించినా వుండవలె ఆమె అంతా దొర్లడంచేత నిరాశపుట్టి నిస్సహాయుణ్ణాయి చూస్తో కూచున్నాను. నా వుద్ధృతం తగ్గి పశువువలె ప్రవర్తించిన నా క్రూరత్వానికి, లజ్జాహీనత్వానికి నేను సిగ్గుపడి, ఆమెకి మొహంచూపలేక బైటికివొచ్చాను. కాని ఆమెమీాది

కోపంపోలేదు. తలుచుకున్నప్పుడల్లా నాకు మండిపోతోంది? యింతలో ఆమె సొమ్మేంపోయింది? అనే భావం వదలదు. పడవ ఆగింది. దూకేశి వెళ్ళిపోయినాను ఊళ్ళోకి. ఊరుపేరన్నా యెవర్నీ అడగలేదు. ఆమా? ఆమె యేమయిందో! రెవికా, చీరా, లేదంటావా? నే నేంచెయ్యను?



## ౬. మ చ్చ లు

పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు భవానిరావు 'డ్యూటీ'మీాద వెడుతోవుంటే, నేను వెళ్లాను. బ్రాహ్మణ వీధులలో చిన్న పురాతనపు పెంకుటిల్లది. దాని ముందు పెద్ద గుంపు పోగయింది. పోలీసు జవాను అడ్డం నుంచుని ఎవర్నీ లోపలికి పోనివ్వటంలేరు. మే మిద్దరమూ నడవాలోంచి లోపలికి వెళ్లాము. కిటికీకింద మూలనున్న పెద్ద నవారు మంచంమీాద ఆపిల్ల శవం పడివుంది. మాసిపోయిన చంగావి చీరా, నల్లని రెవికా రక్తంతో తడిసి వున్నాయి. మెడకింద వాడు పళ్లతో చీల్చిన గాయం కనపడుతోంది. ఎదిగినవాళ్ల కెవరికీ అంత చిన్న పిల్లను నే నెన్నడూ చూడలేదు. ఆ అమాయకమూ, విశ్వాసమూ, ఆశ్చర్యమూ, కళ్లు మూతలుపడివున్న, ఆచిన్న పెదవి వొంపులో, ఆ గడ్డం కొనలో, ఆ కనుబొమ్మలు కలుసుకోడంలో నాకు కనపడ్డాయి. నిద్దట్లో భయమేసి యేడుస్తున్నట్టే ముద్దుగా జాలిగావుంది. భవానిరావు 'నోట్సు' తీసుకుంటున్నాడు. నన్ను బాధించే జాలిని భరించలేక బైటికి వెళ్లాను.

అరుగుమీద కూచున్న ఒక కుర్రాడి చూపు నన్నతని వేపు కనిపెట్టి చూసేట్టు చేసింది. అతని మొహాంలో విచారమూ, నిరాశా, ద్వేషమూ చెప్పలేనంత గాఢంగా కనబడుతున్నాయి.

"ఎవరు నువ్వు?"

నా మాట నిర్లక్ష్యంచేసి

"వాణ్ణేం చేస్తారండీ?" అన్నాడు.

నడవాలో కూచున్న కైదీవంక చూశాను. అక్కడ జరిగే వ్యవహారమంతా తన కేమీ సంబంధం లేనట్టూ, తనేదో తన తపస్సులోనో యోగంలోనో వున్నట్టు కూచుని వున్నాడు.

"మీరు పోలిసులేగావును. అనుకని అడిగాను. అయినా వాణ్ణేంచేస్తేమాత్రం మీ కేం పట్టింది. మీపని మీరు చేసుకు వెడతారు."

అని వూరుకున్నాడు. అతని మాటల్లో బాధా అణుచుకుంటున్నటువంటి మహావిచారమూ, చూసి ఆశ్చర్య పోతో నుంచున్నాను. మళ్లీ అతను

"వాణ్ణేదో చేస్తారు తప్పదు. ఉరి తీస్తారేమో! కాని వాణ్ణిప్పుడేంచేసి ఏంలాభం? పోయినప్రాణం, మధురమైనదీ, అమాయకమైనదీ. ఆప్రాణం తిరిగిరాదుకదా, ఆమెమళ్ళీ మెల్లిగా, దీనంగా, నడుస్తో, బెదిరిబెదిరి చూస్తో, యింకకన పడదుకదా? ఎవరన్నా ఒకరు దయగలవారు, తనకోసం అను కంపపడేవాళ్లు ఈ లోకంలో వున్నారా అని వెతికివెతికి, కన పడక, నిరాశపడి, పరలోకాన్ని వెదకబోయింది. ఇప్పుడు- అంతా మిగిలిపోయింతరవాత, అందరూ కనికరం చూపేవారే!

అన్యాయం జరిగిందనేవాళ్ళే! కాని ఆకేళ్ళనించి వాళ్ల కళ్ళముందే యీ హత్య జరుగుతోవుంటే, వొక్కడూ— వొక్క ఆడది—ఒక్క దయగలమాట మాట్లాడినవాళ్లు లేరు. శవంమీద వున్న కరుణ వీళ్ళకి మనుషులమీద వుండదు. మీ రందరూ యిప్పుడు—హత్య జరిగింతరవాత వొస్తారు, ఘనుల మని—ఏం చేస్తోందో యీ పోలీసుసిబ్బంది అంతా యిన్ని రోజులూ! బతికివున్నప్పుడు కాపాడేందుకు ఒక్కరూ కన పడరు. శవంచుట్టూ రాంబందుల్లాగు వాల్తారయ్యా! ఇదంతా వాణ్ణి వురితీసేందుకు, యీ అట్టహాసం! ఏం లాభం? ఏం న్యాయం? ఆ పిచ్చివాణ్ణి చంపి? వాడి కేం తెలుసు?" అన్నాడు.

"వాడికి పిచ్చా?"

"పిచ్చా! ఏమో! నాకు తెలీదు. మీడాక్టర్నడగండి" నేనింకా అడగ బోతుండగా, చివాలునలేచిగుంపు వెనక్కి పోయి మాయమైనాడు.

ఆవాళ్ళ సాయంత్రం కాలవవొడ్డున చాలాదూరం షికారు వెళ్ళి యింటికి తిరిగివస్తున్నాను. ఆకలివేస్తోంది. వంటవి సిద్ధం గానే వుంటుంది గాని, యిల్లుచేరగానే మెతుకులురావు. కాళ్లు కడుక్కొని, మడిపంచకట్టి, సంధ్యవార్చినట్టు నటిస్తేనేకాని, మాఅత్త అన్నంగిన్నె చాయకుపోదు. నాఅదృష్టం కొద్దీ, మేనమేనమామ సవితితల్లి మరది తమ్ముడో నామీద ప్రేమ చాత వొచ్చిమడిగట్టి ముక్కుమూశాడంటే, పదిగంటల కన్నా తిండి దొరికిందే. అదేమి ప్రారబ్ధమో మాయింటికి వొచ్చిన అతిథు లందరికీ, మొదట ఆచారమూ, భక్తి, అధిక

మారాతాయి. రెండోది ఆకలి మందగిస్తుంది. కాని భోజన తత్పూర్వమే ఆనందం, భోజనప్రారంభములోనే ఆనందం మాయమై, చప్పున మొదట ఆజ్యధారతోనే జఠరాగ్ని భగ్గుమని, సమస్త పదార్థాలనీ ఆహుతి చేస్తుంది, నాకు మాను వడ్డనకన్నా మిగలకండా.

తదియ చంద్రవంక రక్తంతో తడిసిన వంకరికత్తిలాగు పడమట జారుతోంది. గాలి రివ్వున చెట్లనన్నిటిని లోంచి దూసుకు పోతోంది. కాలవ రెండో వొడ్డున శ్మశానంలో శవం కాలిపో తోంది. ఎగరకొట్టే ఆగాలిలో నాలికలవలె అగ్నిజ్వాలలు చితిమీదనించి లేచి, పక్కనున్న సలుగురు మనుషులనికూడా అందుకోవాలని చూస్తున్నాయి. ఆపిల్ల శవమే అయివుం టుంది. పొద్దున్న నేనుచూసిన, ముడతలు లేని ఆచిన్నసుదురూ, ఏడుస్తున్న ఆపసిబిడ్డనోరూ యింక లోకంలో యెవరికి ఎన్నటికీ కనపడవు. అంతఅందంగా, హృదయాన్ని కరిగించేట్టు అట్లాంటి చూపుని, మెత్తదనాన్ని అందాన్ని కల్పించి యిట్లా నిర్లక్ష్యంగా నాశనం చెయ్యడంలో యీసృష్టి వుద్దేశ్య మేమిటో? లోకాన్ని మిరుమిట్లు గొలిపిన సౌందర్యవతులు అహల్య, ట్రాయ్ హెలెన్, క్లియొపాట్రా, ద్రౌపది, నూర్జహాన్, పిల్లందరి సౌందర్యమూ, యిట్లానే కాలిపోయింది, చీకిపోయింది, మన్నూ బూడిదా అయింది. ఎందుకో అన్నా! ఈశ్వరుడే సుందరుడూ, ఆనందమయుడూ ఐతే, లోకమంతా యిన్ని వికారరూపాలెందుకో, రూపాలే కాదు- మనసులు, ఆత్మలూ-అన్నీ అవే-ఎక్కడో ఒక్క సుందరమైన ముఖమూ-దృష్టి, హృదయమూ వుంటే, అవి యిట్లా నలిగి, చిరిగి,

నాశనమౌతాయి. నాగుండెల్లో చెప్పలేని దిగులు ప్రారంభించింది.

కాలవపక్కన కూచున్నాడు ఎవడో! ఏడుస్తున్నాడు. ఆగాను. ఆ సన్నని వెన్నెల ఒకవేపూ, ఆచితిమీది ఎర్రని వెలుగు రెండోవేపు ముఖంమీద పడుతోంది. వెర్రిచూపు. వొళ్లంతా తడిసింది. వెక్కి వెక్కి యేడుస్తున్నాడు, పొద్దున్నటి కుర్రాడు. నాశవంకూడా ఆవిధంగా తగలపడేరోజు నాకళ్ళ యెదట భావించుకుంటున్న నాకు ఆసమయంలో నాదురభిమానమూ, అధికార గర్వమూ, విద్యాధిక్యతా అన్నీపోయి, సమస్తజీవరాసులతోటీ సమానత్వం తటస్థించినట్టు తోచింది. ఆ అబ్బాయి దగ్గిరికి వెళ్ళి, బుజంమీద చెయ్యేసి

"తమ్ముడూ! ఆబాధ యేమిటో నాతోటి చెప్పరాదూ?" అని దయగా అడిగాను. వెంటనే హృదయకుహరాలు విడిపోయినట్టు

"కాలిపోతోంది. పోతూంది కాలిపోతోంది." అని బిగ్గిరిగా యేడ్చాడు. అతని చెయ్యి పట్టుకుని దూరంగా నడిపించుకుని తీసికెళ్ళాను. చంద్రుడస్తమించాడు. నక్కలు కూస్తున్నాయి. కాలవనీళ్ళు తూముకిందనుంచి 'లబలబ' శబ్దంచేస్తూ పోతున్నాయి, చీకట్లో భయంలేక కీచురాళ్లు శబ్దంచేస్తున్నాయి.

"సంగతేమిటి? ఆపిల్లనీకు బంధువా? ఇట్లారహస్యంగా యెందుకేడుస్తావు?"

అప్పటికి పొల్లివొచ్చే విచారాధిక్యత తగ్గింది. కన్నీళ్లు తుడుచుకుంటో యీ కథ చెప్పాడు. నా ఆకల్నీ, భార్యనీ,

మెంతిపెరుగునీ, కందిపచ్చడినీ, బంధువుల్నీ మరిచిపిన్నాను-ఏ రాత్రిదాకానో-

"వాళ్లది బీదకుటుంబం. ఆ పిల్ల ప్రతిదినమూ మా యింటికి మజ్జిగకి వొచ్చేది నా భార్య ఆమెతో సాధారణంగా సరసాలాడుతో దయగా హేళనచేస్తో వుండేది. నేనూ అక్కడ వుండడం తటస్థించినప్పుడు తమాషాకి మాటలు కలిపి నవ్వేవాణ్ణి. ఆమె చక్కని చిన్న నవ్వు నవ్వేది. ఆ నవ్వు చూడాలనే సరదాల్తో, ఏదో వొకటిచెప్పి నవ్విస్తాను. ఒకరోజు ఆమె బుగ్గమీద పెద్ద మచ్చతో మా యింటికి వొచ్చింది. నా భార్య అదేమిటని అడిగితే, సిగ్గుతో, మాట తడబడపడి, మంచంకోడు తగిలిందని చెప్పి తప్పించుకోవాలని చూసింది. నా భార్య వొదలక ఏమిటో చెప్పమని ఆ మచ్చని పట్టుకు పరియాచకాలాడుతోంది. నేను వెళ్లాను.

"దుర్గమ్మా —"

ఆ పిల్లపేరు దుర్గమ్మ.

"దుర్గమ్మా, వారంరోజులకిందట దీని బుజంమీద ఎర్రనిమచ్చ వొకటిపడ్డది. నీళ్ళుపోస్తో వీళ్ల అమ్మ అదేమిటేలని అడిగింది కూడాను. అదెట్లా వొచ్చిందో అడుగు" అన్నాను.

నా భార్య "మరీ అట్లానా ?" అని పెద్ద నవ్వు నవ్వింది. దుర్గమ్మ బుగ్గచూసి. దుర్గమ్మ వుడుకుకుని, కళ్ళనీళ్ళు కుక్కుకుంటో, మజ్జిగ తీసుకోకుండానే వెళ్ళిపోయింది.

తరవాత — ఆ రోజు అట్లతద్దిరోజున — నా భార్య ఆ పిల్లని వుయ్యాలమీద కోచోపెట్టి వూపిస్తో నడుందగ్గిర పట్టుకునేటప్పటికి నెప్పి అని అరిచింది ఆ పిల్ల. రెండు మూడు సార్లు

అట్లానే జరిగేటప్పటికి అందరు పిల్లలూ చేరి ఏమిటో చూస్తున్నారు. ఏమో కురుపులనీ, దెబ్బలనీ చెప్తే నమ్మక చీరె బలవంతంగా తొలిగించి చూశారు. ఎర్రని పెద్ద మచ్చ కనపడ్డదని నా భార్య చెప్పి ఒక్కటే నవ్వింది.

కొన్నాళ్ళ తరవాత నాలుగురోజులు మజ్జిగకి రాలేదు. ఏమా అనుకున్నాము. భావిదగ్గిర నా భార్యకి తలకి కట్టుకట్టుకుని దుర్గమ్మ కనపడి, పిలిచినా రాకండా వెళ్లిపోయింది. రెండు రోజుల తరవాత ఆ కట్టుతో వొచ్చింది. మామూలుగా!

"రావటంలేదేం? దుర్గమ్మా!" అన్నాను.

నవ్వి "కట్టు కట్టుకున్నానుగా!"

సమాధానానికి కట్టుకుం దనుకున్నాను.

"మాని విప్పిందే వొచ్చావేం?"

"విప్పిందాకా వుంటే, మజ్జిగ లేక యీలోపున కాకచేసి చస్తామని భయమేసింది. అదిగాక అన్నంలోకి యింకేం గతిలేదు."

"ఆ కట్టు తియ్యి"

"అమ్మో! ఆశే!"

"ఏముంది?"

"గత్తాలన్నీ వొలికిపోవూ?"

"నేను రెండేరుకుంటాను."

అని చప్పున కట్టు లాగేశాను. బిత్తరపోయింది ఆ మనిషి. రెండు బుగ్గలమీాదా, రెండువరసలు పళ్లు దిగపడ్డ గంట్లువున్నాయి. కళ్లవెంట నీళ్లు పెట్టుకుంటో కొంగు ముఖం మీాద కప్పుకుని దుర్గమ్మ పారిపోయింది. ఆ గాయంచూస్తే

నాకు భయం జాలి, ఆశ్చర్యా, యిన్నికలిగాయి. పొంగున్న చూలాలా, వాడే రత్తయ్య, ఆమె మొగుడు. వాణ్ణి నేను మొదటినించీ యెరుగుదును. చిన్నప్పుడు వాణ్ణి చిచ్చిరత్తయ్య అనేవాళ్లం. ముంగి. చిన్నప్పుడుకూడా, ఆటలాడేటప్పుడు, సన్నిసం, గంతులెయ్యడు. గుడ్లగూబలాగు చూస్తూకూచుంటాడు. వాణ్ణి చూస్తే అందరికీ అసహ్యాం. ఏదో ముంగిగా తిరగాడేవాడు. పెద్దయినాక మేమెవరం వాడితో మాట్లాడ్డం మానేశాము. వాడూ ఒకరితోమాట్లాడడు, ఒకరి జోలికిరాడు. పనిచెయ్యడు. అట్లాకూచుంటాడు చుట్టకాలుస్తో.

వాడిప్రకారం, ఆ పిల్లాగుంటే సహిస్సును. మొందుకు బాధించాలా అని ఆలోచించాను. వాడేనా? వాడుకాక యింకెవడు? దుర్గమ్మవంటి భార్యవుండడం ఎవరికైనా ప్రమాదం. అతనికి క్రోధం కల్పిస్తుందని అనుకోడం కూడా పాపకరమైన విషయం. దుర్గమ్మనే అడుగుదా మనుకున్నాను. కాని యింత వరకు నాభార్య వెనకనుండి పలకరించాలేగాని, ఎన్నడూ నేనాపిల్లతో సరిగా మాట్లాడలేదు. అందుకని నాభార్యనే అడగమన్నాను.

ఒకరోజు దుర్గమ్మతండ్రి వాళ్లవూరునించి దుర్గమ్మని చూడ్డానికివొచ్చి, మానాన్నగారి దగ్గిరికి వొచ్చాడని తెలిసింది, మానాన్నగారు మునసబూ, ఆవూరికిపెద్దా. ఆయన మానాన్న గారితో, తన కూతురికి పుట్టింటికి రానియ్యనని వున్నదనీ, రత్తయ్య పంపడంలేదనీ చెప్పుకుని యేడ్చాట్ట. తరవాత వారంరోజుల్లో రత్తయ్య పెళ్లాన్ని కొడుతున్నాడని పుకారు పడ్డది. నాకెందుకో ఆపిల్లసంగతి మొదటినుంచి నాస్వంత

వ్యవహారంగా కనపడేది. పుకారు ప్రబలమయింది. నాకు దుర్గమ్మ కనపట్టంలేదు. నాకూ జాలివేసి ఆపుకారు యెట్లా వొచ్చిందని విచారిస్తే, రత్తయ్య యింటిపక్కనవున్న నాగన్న పుట్టించాడని తెలిసి వాణ్ణి దబాయించాను. వాడు రుజువు చేస్తున్నాడు. మర్నాడు తెల్లారకట్ట వొచ్చి, నన్ను లేపి రత్తయ్య యింటిపక్కన నుంచోపెట్టాడు. లోపల్నించి జాలిగా మూలుగు వినపడుతోంది. క్రమంగా పెద్దదై యేడుపుగా మారింది. కాని కోపంతో కేకలు లేవు. మళ్లీవిన్నాను. నేనో విధంగా అర్థంచేసుకున్నాను. పట్టరాని నవ్వువొచ్చింది నాగయ్య యేమిటంటాడు.

"ఏమిటా? అది కొట్టడంరా? నీ మొహం? నీకూ పెళ్లిగానీ ఆ మూలుగు అర్థమౌతుంది. ఇట్లాంటి వెధవపుకార్లు పుట్టించకు. తన్నేను." అని వాణ్ణో తోపుతోసి యింటికి వొచ్చి నిద్రపోయినాను. కాని దుర్గమ్మ వొంటిమీద చూసిన గాయాలూ, ఆపిల్ల కళ్లల్లోచూసిన బాధా నా మనసుని కలవర పెట్టి, ప్రశ్న లడుగుతోనే వున్నాయి.

వారంరోజుల్లో దుర్గమ్మ మా యింటికి వొచ్చింది. అన్నాళ్ళు ఎందుకురాలేదంటే జవాబు చెప్పలేదు. అప్పుడు నేనూ నా భార్యా కలిసి అడిగాము. "నిన్ను రత్తయ్య, కొడతాడా?" అని. కొడుతోవుంటే, వాడు మానేటట్టు చేస్తానన్నాను. ఆ మాటలకి చెప్పరాని భయమూ, సిగ్గూ, కలిగి దుర్గమ్మ లేదు లేదని, ఏదో వికారంగా అని వూరుకుంది. ఎంత అడిగినా చెప్పలేదు. అటు తరవాత దుర్గమ్మని చూసినప్పుడల్లా నవ్వొచ్చేది. వాళ్లిద్దరి సరసాలూ అంత తీవ్రంగా

వుంటాయిగావును అనుకున్నాము. "ఏం దుర్గమ్మా ! ఎక్కడన్నా కొత్తమచ్చలు !" అని మొదట్లో నా భార్యా తరవాత నేనూ అనడం మామూలయింది.

నా భార్య ప్రసవానికని పుట్టింటికి వెళ్ళింది.

ఒక సాయంత్రం మా దొడ్లో దుర్గమ్మ గోంగూర కోసుకుంటూ వుండగా నేనక్కడికి వెళ్ళడం తటస్థించింది. దడి దగ్గిరగా తెల్లవీ, పచ్చవీ చంద్రకాంతపూలు వికసించాయి. ఎండలో వాడిలిన గోగుపూలు సాయంత్రపుగాలిలో ప్రాణాల్ని నింపుకుంటున్నాయి. కొట్టంముందు కట్టిన ఆవులు నన్ను చూసి మెడలు చాస్తున్నాయి. వుండుండి అంబాఅని పిలుపు వినపడుతోంది. రాత్రి శాంతి అప్పుడే భూమినావరించింది. దుర్గమ్మ వొక్కత్తా గోగుచెట్లనడుము, దిగులుగా నుంచుని, ఒకొక్క ఆకే వొళ్ళో వేసుకుంటోంది నా హృదయంలో అపరిమితమైన దిగులు ఆవరించింది. ఆమెదగ్గిరికి వెళ్ళి

"ఏం కొత్తమచ్చలు లేవూ?" అన్నాను.

సిగ్గుపడక, చిన్న నవ్వుతో "లేవండీ" అంది.

నా మనసులో కొత్తవికారం వుదయించింది. భార్య యింట్లో లేకపోవడమే కారణమనుకుంటూ ఇంకా దగ్గిరగా అడుగువేసి, కొంటెగా, "కొత్తమచ్చలు లేనే లేవా ?" అన్నాను మళ్ళీ.

"ఉంటే, కనపడవు" అంది ధైర్యంగా.

"కనపడనిచోట్ల వున్నాయా ?"

కళ్ళూ తలా తిప్పేసింది. ఆ నిముషాన ఆ పిల్లమీద నిష్కారణమైన జాలీ, వున్నతమైన ప్రేమా కలిగాయి. ఆ

చూపులో యితరుల సహాయం అడిగే జాలివుంది. నేను చెయ్య గల సహాయం ఒకటే కనపడ్డది నాకు. ఆ సమయాన ప్రేమకీ, కామానికీ, జాలికి ఎంత సన్నిహితమో! మోకాళ్ల వరకు ఎగదీసి కట్టిన ఆమె చీరా, రొమ్ముని దాచడానికి శ్రమపడే ఆ రవికా, గాలిలో వూగుతున్న ఆమె జుట్టూ, నన్ను వెళ్ళిపోనీక ఆటంక పెట్టాయి. ఈ గోంగూర ఒక్కొక్క ఆకే కోసి, ఏరి, వొండి, ఆ చీకటి బూజుయింటో, ఆ మూల, ఆ ముంగి వెధవకి తిని పిస్తుంది. ఒక్క ఆకి నన్నా మిగల్చక తిని, యీమె వంక తలెత్తి చూడక లేచిపోతాడు వాడు. నా హృదయంలోని ఆ కరుణా భావాన్ని భరించలేకపోయినాను. ఎట్లా సంతోషమివ్వగలను. ఆ జాలిహృదయానికి: "మచ్చలేవి? చూడని" అని ఆమె బుజం మీది రవికను పక్కగాలాగాను. దుర్గమ్మ మెల్లిగా నా వేళ్లను తొలిగించి మళ్ళా కప్పుకున్నది. అదే పట్టుదలతో రెండో చేతి పక్కన చూశాను.

"అక్కడో పెద్ద మచ్చవుంది. ఇంకా కొంచెం కిందగా మెత్తగా మొదలు పెట్టేచోట యింకో మచ్చవుంది. "పాపం, దుర్గమ్మా!" అని ఆమె తలని నా రొమ్ముకి అద్దుకున్నాను.

"ఎందుకు నా మచ్చలజోలి నీకు? ఎప్పుడూ నవ్వు తావు? వొళ్ళంతా అవే." అని మోకాలిమీద చీరతీసి చూపించింది. నేను చప్పున యింకాపైకిలాగి "ఇంకా లేవా?" అన్నాను. తలయెత్తి నా వంక తెల్లబోయి చూస్తోనుంచుంది. ఎర్రని పడమటికాంతి ఆమె కళ్ళమీద మెరిసింది. నేను ఆమె బుజాల్ని పట్టుకుని వొంచబోయినాను. అప్పుడు కలిగింది జ్ఞానం ఆ అమాయపు కళ్ళల్లో. భయంతో - వొణుకుతో -

ఆచిన్న మొహం-కాలిపోతున్న ఆచిన్న మొహం—చెప్పలేను ఆ బాధ.మెడకాయి తెగుతున్న కోడికళ్ళలోకి వొచ్చే చూపు—

"నీకు చెల్లెల్ని, అన్నయ్యా, కొరకు్క—ఆ పని తగదు నీకు, నన్ను కొరకు్క. నీకు ఆ బుద్ధి కూడదు నీ కాళ్ళు పట్టుకుంటా, కొరకు్క" అని సన్నగా కీచుమని అరిచింది.

నామొహం పటాపంచలయింది. భరించలేని సిగ్గుతో, జాలితో, ఆశ్చర్యంతో వెళ్లిపోయినాను. నామీద, నాకామంమీద, పరమ అసహ్యం కలిగింది. ఆ నాటినించి యింత వరకు పరాయి ఆడదాన్ని తాకలేదు. ఆచూపు నన్ను దయ్యం వలె వెంట తిరుముతోంది. ఆకళ్ళు, దీనమైన ఆకళ్ళు- ఎవరితోను చెప్పుకోలేని బాధతో కుంగిపోయిన ఆపాపలు రక్తధారలు కార్చిన ఆ పాపలు- బొగ్గైపోతున్నాయి. తననే కాకుండా, లోకాన్నంతా నాకు చెల్లెళ్ళని చేసింది దుర్గమ్మ. తల్లి కాలిపోతోంది.

ఆలోచించాను, కొరకవొద్దని అరిచిందేమిటి? ప్రేమ అన్నా, లాలన అన్నా, దుర్గమ్మకి కొరకడంతో ప్రారంభమని అభిప్రాయం. వాడూ ఆరత్తయ్యకారణం. వాణ్ణి వెళ్ళి "ఇదేం, రోగంరా!" అని తందామనుకున్నాను. కాని నాకెట్లా తెలిసిందని వాడనుమానపడడా? వాడి భార్యమీద అట్లాంటి కోర్కెపడి, పైగా వాణ్ణి యామని తన్నను? ఏంచెయ్యను? దుర్గమ్మని వొచ్చేసి మాయింటో వుండమంటే, పారిపొమ్మంటే, లేక నేను యెక్కడన్నా ఆమెని కాపరం పెడితే,

ఇట్లాంటి చాతకాని ఆలోచనల్ని చూసి నేనే నవ్వు కున్నాను.

దుర్గమ్మ మాయింటికిఇంక రాలేదు. ఒక్కసారి ఆమెతో మాట్లాడాలని వుంది. నాభార్య నెలరోజులయిం తరవాత వొచ్చింది పుట్టింటినించి. రాగానే ఆమెచాత కబురంపి పిలి పించాను దుర్గమ్మని.

"దుర్గమ్మా, రత్తయ్య రాక్షసి. నువ్వా బాధలు పడ లేవు. ఎక్కడికన్నా వెళ్లు. నేను సహాయంచేస్తాను."

"నేనా? ఎక్కడికన్నా వెళ్ళనా? సంసారం వొదలు కుని! మంచిమాటలు మాట్టాడుతున్నారు. నేనెందుకువెళ్లాలి?" అని ఒక్కవిసురున వెళ్ళిపోయింది.

నాకు దుర్గమ్మమీద కోపం వచ్చింది. సహాయం చెయ్యపోతే యిదీ! కాని నేను ప్రయత్నించిన దుర్మార్గమూ, ఆమె విశ్వాసాన్ని పోగొట్టుకున్న సమాచారమూ చక్కగా మరిచిపోయినాను.

రత్తయ్యమీద వూరంతా పుకార్లుగా వున్నాయి. అత నికిపిచ్చెత్తిందంటున్నారు కొందరు. ఇద్దరు ముగ్గురు యీడికఆడ వాళ్ళని వెంబడించి బలవంతం చేసి పట్టుకుని కరవబోతే, దొంగఅనుకుని తన్నారుట. దుర్గమ్మ రెండుసార్లు యింటోంచి పారిపోతే వూరివాళ్ళు లాక్కొచ్చి దిగబెట్టారు. ఈ సంగతు లన్నీ వింటున్నా నేను జోక్యం కలగచేసుకోలేదు. నాకేం? ఆడది తృణీకరించింతరవాత మళ్ళీ ఆమె క్షేమం కనుక్కుం టానా ? అని అభిమానపడ్డాను.

ఒకరోజు రాత్రి నాపడకగదితలుపు కొట్టారు యెవరో. తెరిస్తే లోపలికి వచ్చింది దుర్గమ్మ. నా భార్య పందిరిపట్టె మంచంమీద, చామంతిపూలతో, పట్టు దిండుమీద తలపెట్టుకుని నిద్రపోతోంది. నేను కుర్చీలో పడుకుని, పతివ్రతలకథలు చదువుకుంటున్నాను. కొత్తగాపుట్టిన మా పాప వాడిఅమ్మమ్మ యిచ్చిన వుయ్యాలతొట్టిలో పడుకుని, దీపంకేసి చేతులుజాచి వుంకొడుతున్నాడు. సాంబ్రాణి వొత్తులు కొన్నవరకూ వెలుగుతున్నాయి. మా గదినీ, మా సౌభాగ్యాన్నీ గావును చూస్తో నుంచుంది దుర్గమ్మ.

"ఈరాత్రికి, మీ యింటో... ఆ వసారాలో... యెక్కడైనా సరే పడుకోనియ్యండి" అంది కష్టంగా.

కారణం తెలుసుకోవాలనే ప్రబలమైన నా కోర్కెని దిగమింగుకుని,

"దానికేం ? పడుకో. మీ యింటో పీలులేదా ?" అన్నాను. గుడ్లనీళ్లు కుక్కుకుని మాట్లాడలేదు. వరండాలో మంచం జంపకానా వేసి పడుకోమన్నాను. నా వెంటవొచ్చి మంచంమీద కూచుని, వెళ్ళబోయ్యే నా చెయ్యి పట్టుకుని, కళ్ళనద్దుకుని వెక్కి-వెక్కి యేడ్చింది. కాని ఏమీ మాటాడదు, ఎంత అడిగినా—

"నిర్భాగ్యురాలిని. నాసంగతెందుకు-వెళ్ళి పడుకోండి" అంటుంది. ఏం చెయ్యను ?

జీవితంలోని దురదృష్టవంతులు, మన పక్కనేవుంటారు, మనలోనే, స్నేహంగా తిరుగుతోవుంటారు. బాధపడుతో గాయాలు పడుతో, మన కళ్లయెదటనే అకాలమృత్యువు వేపు

నడుస్తోవుంటారు. మనం గుర్తించం. గుర్తించినా, మన ఆనందం లోంచి తప్పుకుని వాళ్ళకోసం చెయ్యి జాచము. జాచినా, సహాయాన్ని తీసుకోరు. సహాయం చెయ్యలేము. నిస్సహాయులము. సహాయం తీస్కోడం వారి చాతకాదు. దౌర్భాగ్యులు, నిస్సహాయులు, విచిత్రమైన లోకం—భయంకరమైన జీవితం—

"నేను కష్టపెట్టి, నలగకొట్ట తలుచుకున్న వాళ్లకి నువ్వా, ఓరి అల్పుడా, నువ్వా, సహాయంచేసేది! కానీ!" అని మొహాన నవ్వినట్టుంటుంది, యెవరో రాక్షసి!

తెల్లవారి నేను లేచేముందే వెళ్లిపోయింది.

రెండురోజులతరవాత ఒకనాటి మధ్యాన్నం, నేను వసారాలో పడుకుని అబ్బాయిని గిలిగింతులు పెట్టి నవ్విస్తూ వుండగా, దుర్గమ్మ వొచ్చి మంచంపక్కన కూచుంది.

"అన్నయ్యా! ఆన్నాడు నన్నెక్కడికన్నా పొమ్మన్నారే! పోతాను. ఎక్కడికి పోను?"

అన్నానన్నమాటే గాని ఎక్కడికి పంపను?

"మీఅమ్మదగ్గిరకో, అన్నయ్యదగ్గిరకో వెళ్ళకూడదా?"

"అయింది. మళ్లీ లాక్కొచ్చాడు."

మాయింటో వుండమనడానికి ధైర్యంలేదు. రత్తయ్య వొచ్చి గోలచేస్తే మాఆయన వొప్పుకోడు. నేను మాత్రం అపవాదు పడగలనా?

"ఎక్కడన్నా నేను వుంచుతాను, యీవూళ్ళో."

"బతకనీడు."

"ఇంకేం చెయ్యను?"